 Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
జానపాడు.

సంపుటము 20 — 1928 సం॥ జులై నెల — సంచిక 4

## విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, బాజేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, మానెకొండూరు.
౩ కాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాడవరం.
౪ రామసింగుగారు–నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు– నెల్లుట్ల.
౫ శ్రీమద్వేంకట శేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పోషకులు.

౧ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహద్దరుగారు, జమీందారుగారు–నూజవీడు.
౨ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానెకొండూరు
౩ జాగర్లమూడి కుప్పుస్వామినాయఁడుగారు, కారంచేడు
౪ నెల్లుట్ల నరసింహారావుగారు, జనగాం
౫ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౬ రంగాచార్యులుగారు, ముక్తారు, దేశముఖు, మసీదుపల్లె.
౭ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ రామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౯ తంగెడ నరసింహారావుగారు, కరణం, మొర్జంపాడు.
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జనగాం
౧౧ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౧౨ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౩ పిఠాపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౪ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, విశాఖపట్టణంజిల్లా.
౧౫ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, పాకాల.
౧౬ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం
౧౭ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురం,
౧౮ రాజా కందుకూరు సూర్యప్రకాశరావు బహద్దరు, జమీందారుగారు–దేవిడి.

## సహాయులు

౧ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౨ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౩ బీరకాయల హనుమంతరావు దేశపాండ్యాగారు, రాయగిరి
౪ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి
౫ జారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు, తమ్మవరం.
౬ వెలమకన్ని శోభనాద్రిరావుగారు – శోభనాద్రిగూడెం
౭ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, షాపురం.
౮ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౯ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౧౦ తిప్పరాజు కామేశ్వరరావుగార్లు, కరణం, దుగ్గిరాల

అభినవసరస్వతి

సంపుటము ౨౦ | జానపాదు విభవ సం॥ ఆషాఢమాసము | సంచిక ౪

# ప్రభుత్వమువారింతపాపకార్యమునకు నొడిగట్టుదురా?

ఒడిగట్టరనియే విశ్వసించుచున్నవాఁడను. శ్రీ శ్రీ విక్టోరియా చక్రవర్తినిగారు తొల్దొల్త దయతో మన కొసఁగిన మతవిషయక వాగ్దానమే యిందులకుఁ గారణము. అద్దాని ననుసరించియే తత్ప్రతినిధులును మతవిషయములందు జాగరూకతతో మెలంగుచున్నారు. కాని యిప్పుడిప్పుడు మనయిండ్లకు మాటికిమాటికి నోటులకై తిరిగి సర్వవిధములఁ దంటాలుపడి వోట్లను సంపాదించి శాసనసభాసభ్యత్వమునుబొందిన మన విలక్షణసోదరులచే నేలికవారి వాగ్దానమునకుఁ గళంకముగల్గునేమో యని భయపడుచున్నాను. పూర్వాచారపరాయణులును ధర్మనిరతులును ప్రభుత్వమువారి దయచేత రక్షింపఁబడుచున్నారు. అందును స్వల్పసంఖ్యాకులగు బ్రాహ్మణవైశ్యజాతులవారని చెప్పనొప్పు. ప్రస్తుతంబునందు శాసనసభలలో రాజకీయవిషయంబులందు జోక్యముకలిగించుకొని దొరతనమువారికి దగినట్లు విన్నవించుకొని ప్రజలకు మేలుసల్పుటకు నణుమాత్రము శక్తిలేనివారు కొందఱు "పనిలేనివానిపనివలె" దేశక్షోభకరంబులును ధర్మదూరంబులును శాస్త్రవిరుద్ధంబులును మానహానికరంబులును నగు మతవిషయక శాసనంబులను శిక్షాపూర్వకంబుగాఁ బ్రతిపాదించి దొరతనమువారి

యనుమతిబడసి ప్రజలపై వినియోగింపఁదలఁచియున్నారు. ఇదియా వీరిపని ! స్వధర్మములను శాస్త్రవిహిత పరంపరాచారములను దూఱుటయా ? ఈ శాసనసభ్యులకు మామతధర్మములతో బనియేమి ? తమకు శాస్త్రవిహితధర్మాచారములపై విశ్వాసము లేకపోవుగాక మమ్ములనుగూడఁ జెడగొట్టుటయేల ? అందునను జెడకపోయినచో మిమ్ములనందఱిని దొరతనమువారిచే శిక్షితులఁ జేసెదమందురా ? వహ్వారే వహ్వా. చాలుఁజాలు మీపనులిక గట్టిపెట్టుఁడు. శాసనసభ్యులారా ? మతవిషయకశాసనంబులను నేర్పాటుచేయవలసినదని మిమ్ములను మేమెన్నఁడును కోరియుండలేదు. ఇది మీకుదగదు. శక్తిగలదేని ప్రజాహితకార్యములం జేయుఁడు. లేదా యూరకుండుఁడు. మీ కెప్పటికిని మతవిషయములను శాసనసభలో మాట్లాడుట కధికారము లేదు. వేదశాస్త్రములు చెప్పినట్లు ధర్మముల ననుష్ఠింపఁ దలఁపమేని మిక్కిలి ఘోరమగు పాపఫలంబు ననుభవింపవలసివచ్చును. ఈబాధ యిహమునందేకాక పరమునందు వినుమడిగా మమ్ము వేధింపగలదు. మాకుఁ బాశ్చాత్యపద్ధతు లక్కఱలేదు. వారివేషభాషలు పొట్టకూటికై తగినట్లు మాలోఁ గొందఱు సమ్మతించినను ధర్మజాత్యాచారముల కిచ్చగింపరు. ఇఁక స్త్రీలా ? గృహరాజ్యమునందు నాయకురాండ్రై యుండవలసినదేకాని యిప్పటి నాగరకాంగనలవలె అనఁగా బాశ్చాత్యపద్ధతిగోరు స్త్రీలవలె సభలకుఁజని యుపన్యసింప నిష్టపడరు. వివాహాదిసర్వధర్మంబులు మతసంబంధంబులుగాని స్వేచ్ఛికంబులుగావు. కాన మద్రాసు ముత్తులక్ష్మమ్మగారు ఢిల్లీ హరవిలాసశారదాగారు శాసనసభలలో ప్రవేశపెట్టిన శిక్షాపూర్వక బాల్యవివాహనిషేధశాసనంబులు సంఘక్షోభకరంబులనియు నవినీతిదాయకంబులనియు శాస్త్రనింద్యంబులనియు శిష్టాచారవిరుద్ధంబులనియు మానహానికరంబులనియు దలంతురుగాక. ఇవియేకాదు ఇట్టి మతవిషయకశాసనంబు లన్నియు

(నిదివరకువచ్చినవి రాబోవునవి వచ్చుచున్నవి) శాస్త్రదూరంబులనియు నరకపురముఖంబులనియు నెంతురుగాక. కాన శాసనసభాసభ్యులందఱు పనికిమాలిన యిట్టిశాసనంబులను నేర్పాటుచేయకుందురుగాక. మీ బ్రతుకును దేశక్షేమమునకై వినియోగించి యైహికాముష్మికసుఖంబులను బొందుదురుగాక. ఒకవేళ నెవఁడైన నిట్టి శాస్త్రమతాచార ధర్మవిరుద్ధశాసనంబొకటి గూర్పఁదలంచినను దానిని మహాపురుషులగు శ్రీ యం. కె. ఆచార్య యం. యల్. ఎ. గారు ప్రతిఘటించినట్లు సకారణంబుగా నెదురుకొందురుగాక.

మహాజనులారా! ఇప్పటికైనను మీకుఁ దెలివివచ్చినదా? రెండు కండ్లు తెరువుఁడు చూడుఁడు. మీ యింటికి "నాకియ్యండి నాకియ్యండి" యని మాటిమాటికిఁ దిరిగి బ్రతిమాలి మీచే వోట్లను సంపాదించుకొనిపోయిన మనవారు శాసనసభలలో నెట్టివిపరీతశాసనంబులను నేర్పాటు చేయుచున్నారో! చిట్టచివరకు మనము గన్న కొమరులకును గొమరితెలకును వివాహాదిశుభకార్యంబులం జేయజాలని స్థితికి వచ్చినాము. కనుఁడు. సాహసించి స్వతంత్రముగా మనపిల్లలకు శుభకార్యంబులం గావించినచో 1000 రు జరిమానాయు సంవత్సరమో కొన్నిమాసములో జైలును మన మనుభవించవలెను. అరరే! కనుగొంటిరా మీరు చేసిన యుపకారమునకు వారుచేసిన ప్రత్యుపకారము! కాన నికనైనఁ దెలివితెచ్చుకొని మన శాస్త్రాచార ధర్మకార్యములను గాపాడగలరని ప్రవర్తనమువలనఁ దెలిసికొని యటువంటి ధర్మనిరతులగువారికే మీవోట్లనీయుఁడు. ఇటుల ననవసరకార్యములకుఁ జొరబడువారి కీయకుఁడు. మన మతధర్మములను గాపాడుటకును మన యభిప్రాయంబులనైనఁ బ్రభుత్వమువారికిఁ దెలుపఁదలఁచిన బ్రాహ్మణ వర్ణాశ్రమధర్మసంస్థాపన శ్రుతిధర్మసంజీవని స్వధర్మప్రకాశిని అభినవ సరస్వతీ త్రిలింగాది పత్రికారత్నములను ఆదరింతురుగాక. ఏకవలె

మెత్తమెత్తగానుండి వోట్లతో సభ్యత్వమును సంపాదించి తరువాత కొబ్బరికాయకువలె గండ్లు శిరమున కెక్కి మన బాగోగులఁజూడఁజాలక మేకువలెఁగూరుచుండి యిట్టికార్యములను సలిపెడి ప్రబుద్ధుల వలలోఁ బడకుందురుగాక.

మహాప్రభువులారా!

మా మొఱాలింపుఁడు.

నావిష్ణుః పృథివీపతిః, అని యార్యోక్తిప్రకారము మిమ్ములను నమ్ముకొనియున్న యల్పసంఖ్యాకులమగు మమ్మును మరువకుఁడు. మీ వాగ్దానమును విడువకుఁడు. నిలుపుఁడు. మా మతధర్మములను గాపాడుడు. ఆర్యసమాజ బ్రహ్మసమాజ దివ్యజ్ఞానసమాజాది సభ్యులు వేదశాస్త్రవిహితధర్మనిరతులగు హిందువులకు శత్రువు లని తలపుఁడు. మాకు నుపకార మొనరింతు మని యపకారము జేయనెంచు నిట్టి ముత్తులక్ష్మి హరవిలాసశారదా ప్రభృతి శాసనసభ్యుల పలుకులు మతధర్మములందు నేమాత్రము నమ్మకుఁడు. పూర్వాచారపరాయణుల మగు మాలో నౌకరిజోలి యక్కరలేదని కొందఱును గానున్నది కాకమానదు అని శుద్ధవైరాగ్యభావముతోఁ గొందఱును, పత్రికలలో సభలలో నేమి జరుగుచున్నది తెలియక కొందఱును, భయముచేఁ గొందఱును, మోమోటమిచేత గొందఱును, నుద్యోగంబు లూడు నేమో యని కొందఱును యిటువంటిసమయములందు మాటలాడ కుండ నున్నారు. ఎవరైన గొందఱు ఈశాసనములు మంచివికావు అని మాటలాడినను వ్రాసినను ఆవిషయమును ప్రభువులగు మీకుఁ దెలుపు పత్రికలు లేవు. పైపెచ్చు నిట్టి విపరీతశాసనంబులను బలపరచు పత్రికలు మాభాషలో చాలగలవు. అందులో మొదటిది సంఘసంస్కారప్రియామృతాంజనపత్రిక, (ఆంధ్రపత్రిక) సుమీ. వీనిమాటల నెంతమాత్రము మతవిషయంబులందు గణింపకుండుటకు గోరెద. ఈశాసన

సభాసభ్యు లందఱు చాలవఱకు హూణభాషావిదులే కాని మతధర్మములు దెలియజేయు సంస్కృతభాష నెఱుఁగనివా రని నమ్ముఁడు. మా మతధర్మములగురించి బోధించుటకుఁ జేయించుటకు నధికారముగల వారు మతగురువులు గలరు. వీరికి మీరు దగినంత గౌరవ మిచ్చుచున్నందులకు మేము కృతజ్ఞులమై యున్నాము. రజస్వలావివాహములు ముఖ్యంబుగా బ్రాహ్మణవైశ్యులకు దూష్యంబు లని శ్రుతి స్మృతి సూత్ర సుశ్రుత జ్యోతిశ్శాస్త్ర పురాణ యుక్త్యనుభవ హేతు చరిత్ర ప్రమాణములతోఁగూడ నిర్ణయించుచు రైటుహానరబుల్ శ్రీనివాస శాస్త్రిగారు రజస్వలావివాహశాసన మబాధకము నైచ్ఛిక మని చెప్పి శాసనసభలో బిల్లు ప్రవేశపెట్టి మీచే నిరాకరింపబడినసమయమందు ( 1915, 16 సంవత్సరములలో ) వ్రాసియుంచిన రజస్వలావివాహ ఖండనగ్రంథము నొకసారి జూడుఁడు. కాన నిట్టి నింద్యంబులైన శాసనంబులను నేర్పాటుజేయక మమ్ములను రక్షించి శాశ్వతకీర్తి బొందుదురుగాక. ఇకముం దిట్టి శాసనంబులకుఁ దావీయకుండుదురుగాక. ధర్మము జయించుగాక.

మ॥ అరరే ! చాగురె ! దోషదూషితమహాహంకారహుంకారసం
కరలుంటాకచయమ్ము లిమ్మెయిని నిష్కాపట్య వేదోక్తధ
ర్మరహస్యంబను బొక్కసంబుగని బల్ మాయొక్తులన్ దొంగిలన్
సరదారుల్గ చెలంగి రొక్కపరిఁ గృష్ణా ! చూడవే యాదెసన్

---

# పల్నాటి భక్తసమాజము.

---

గుంటూరు తెనాలి బాపట్ల మున్నగు తాలూకాలవారు భక్తసమాజ మని యొక డేర్పఱచుకొని మూఁడుమాసముల కొకపరి యొకచో సమావేశమగుచు హరికథానృత్యగీతాదికములచేఁ గృతార్థంమన్యమానులగుటఁజూచి మాపల్నాటివారును నొక సమాజముగాఁ జేరి యుల్లే మాసత్రయమున కొకచోఁ గూడుచుండుటయు నలుగుమల్లె

ప్పాడు వప్పిచెర్ల చినయగ్రహారము వాడపల్లి గ్రామములలోఁ గ్రమముగా సమావేశములు సేయుటయు నేతత్పత్రికాపాఠకులకుఁ దెలిసియున్నవిషయము. తరువాత తంగెడ సన్నిగండ్ల చింతపల్లి గ్రామములలో 3 సమావేశములగుటయేగాక యీ సం॥ జ్యేష్ఠ శు ౧౦, ౧౧, ౧౨ లలో మల్లవోలు గ్రామమున మఱియొకసమావేశ మయియున్నది. ఈసమావేశమునకు 3౬ రు సభికులు చనుదెంచిరి. అహస్త్రయపు టాతేసిజాములును హారికథాగీతనృత్యాదులతోడనే వెళ్ళింపక భాష్యపురాణోపన్యాసములకుఁగూడ నవకాశముగలిగించినందుల కీసమాజికుల నెంతయుఁ గొనియాడవలసియున్నది. సభ్యులు చాలమంది సంగీతమాత్రపరిచితులైనప్పుడే యట్లు పొసఁగెడినిగాని విద్వద్భూయిష్ఠమగుట నీసమాజమున కట్టిస్థితి యంతగాఁ బట్టకపోవచ్చును. దీనికిఁ గంభంపాటి సీతారామశాస్త్రిగా రధ్యక్షులు. లంకా గోపాలకృష్ణశాస్త్రిగారు కార్యదర్శులు. సీతారామశాస్త్రిగారు భాష్యత్రయము శాంతిచేసినవారు. గోపాలకృష్ణశాస్త్రిగారు సాహిత్యవంతులేగాక సంగీతజ్ఞులుగూడ. హరికథకులును. స్వాధ్యాయసాహిత్యములు రెండును లోపములేకయున్న ఘటము సీతారామావధానులుగారు పుల్లాభట్ల పాపావధానులుగారు మున్నగు ఘనపాఠులును భాణినీయాదులం బఠించి పరిచితానేక విషయులగు లంకా సాంబయ్యశాస్త్రిగారు శివయ్యశాస్త్రిగారు వెంపటి కోటయ్యశాస్త్రిగారు లంకా సుందరరామశాస్త్రిగారు నారాయణంభట్ల సీతారామశాస్త్రిగారు ఘటము మాణిక్యశాస్త్రిగారు లోనగు నెందఱో విద్వాంసులు నిందు సభికులు.

ఇదియునుంగాక ధూళిపాళ సుబ్బయ్యగారు వెంపటి శ్రీశైలముగారు మున్నగు సంగీతవిద్వాంసులును దీపాల అచ్చయ్యమొదలుగాఁగల హరికథకులును మఱికొందఱును సభ్యత్వమంగీకరించియున్నవారు. ఇందు గోలి మల్లికార్జునశాస్త్రిగారు మణిపూసవంటివారు. వేద

శాస్త్రాదులయం దండఱికన్న మిన్నలై కాదు వీ రట్లగుట. వీరి శుద్ధ సాత్వికతయుఁ దపోనిష్ఠత సదాచారము మున్నగునవియే యట్లు ప్రాఖ్యింపఁ జేరి రేచినవి. వేదశాస్త్రాదులచే విఖ్యాతి నార్జించుట కాదు కావలసినది. ఇట్టి ప్రవర్తనయే సంపాదింపవలెను. మన మెన్ని సమావేశములు చేసినను నెన్ని సమాజములను గూర్చినను నిట్టి యోగ్యత సంపాదించుట దుర్లభము. అట్లు సంపాదించిననాఁడే యివి సార్థకములగుటయు మనము కృతార్థులగుటయు సంభవించెడిని కాని మన సంఘసభ్యుల కెవ్వరికి నీ శాస్త్రిగారి మాటలు నచ్చుటలేదు. లౌకికులకు లోకాతీతు నుడు లెటుల నచ్చును? వీరు ప్రవర్తనచే లోకాతీతులైనను లౌకికులు గాకయుండలేదు. మెట్రిక్యులేషనువఱకు రాజకీయ భాష నేర్చి శాస్త్రజ్ఞానము సంపాదించి తపోనిష్ఠాగరిష్ఠులై వైరాగ్యమవలంబించిన వీరి కేల లోకజ్ఞానము లేకయుండును? అందువలన నేతత్సమాజమునకుఁ గొన్ని సంస్కరణములఁ గావింప నిచ్ఛగించిరి. వీరి ప్రవర్తనకు సంతోషించుచున్న విద్వాంసులే వీరియెడల నతి వినయము మాత్ర మగుపఱచుచు వానిఁ బెడచెవి నిడుచుండ యత్కించిత్సంగీతమాత్రపరిచితులై యజ్ఞజనాత్యంతరంజకంబగు హరిభజనాదుల కుపయోగించు వస్తువు లేల యంగీకరింతురు? కార్యదర్శియు సభ్యుఁడును నేఁటేట మాఱుచుండవలెననియు మాఱకున్నఁ దద్భర మెల్లకాల మొక్కరే మోయుట కష్టమనియు నదియునుంగాక యొకయధికారము స్థిరమైనకొలఁది గర్వ మంకురించుననియు నట్లగుట నితరసమాజముల మనకుఁ గనఁబడుచున్నదనియు వీరు నాలుగైదు సమావేశములనుండి చెప్పుచున్నను నది బధిర శంఖారవమైన నీసారి లంకా శివయ్య శాస్త్రిగారు వెంపటి కోటయ్యశాస్త్రిగారు నాలో నేకీభవించుటచే నీ చర్చ రంగమునకుఁ దేఁగలిగితిమి.

కాని ప్రాక్తనులే యుండవలెననియు నట్లుకానిచో సంఘసభ్యత వదలుకొందుమనియు భజనపరులు ప్రతిఘటించిరి. కార్యదర్శి వారి కొకింత శాంతిచెప్పుటయుఁ దత్కార్యదర్శిపదవికిఁ దగినవారు సంఘమునఁ బ్రకృత మెవ్వరును గనఁబడలేదని విద్వాంసులుకూడ నిర్ణయించుకొన్నతర్వాత నధ్యక్షపదవికి మల్లికార్జునశాస్త్రిగారిని బోటీ నిలిపి వోట్లకుఁబెట్టితిమి. కాని శ్రీశాస్త్రిగారి సుగుణముల గ్రహింపఁగల నేర్పరు లెక్కువమంది లేకుంట సీతారామశాస్త్రిగారే మరలఁ దదధికారమును బడయఁగలిగిరి. వారు తగరని కాదుగాని మూర్ఖులవలనఁ గొన్నిగుణము లున్నవనియు మల్లికార్జునశాస్త్రిగారికి సంస్కరణోపయోగములైన కొన్నిప్రజ్ఞలు కలవనియుఁ గొందఱ మభిప్రాయపడితిమి. సీతారామశాస్త్రిగారు ప్రథమసమాజాధ్యక్షులగు భాగవతుల సూర్యనారాయణావధానులుగారివలెనే సర్వభారము కార్యదర్శిపైనే వైచి యుండెడివారు. కార్యదర్శి కిప్పటికి గర్వమనునది కలుగకున్నను బండితులెల్లని సరిపెట్టుకొందురనియుఁ బామరజనులఁ బ్రమోదపెట్టవలెననియు ననునూహతో విద్వత్ప్రీతికరములైన విషయములకంటె నజ్ఞప్రీతికరవిషయములకే యవకాశ మెక్కువ యిచ్చుచుండును. ఈయూహ కనిపెట్టి సర్వజనతారకములగు విషయముల బోధింపఁగల విద్వాంసులుగూడ మిన్నకుండుచున్నవారు. మిన్నకుండక యేమిచేయవలె? తమయుపన్యాసాదుల కవకాశమిమ్మని వీరుకోరుటయు మీకర్మోపన్యాసములను మీజ్ఞానవైరాగ్యములను వినువారిట నెవరును లేరని వారు బదులుచెప్పి యేయాటలో యేపాటలో పెట్టించుటయునే కదా యేర్పడెడిని. కావున నిట్టిసవరణలచేసికొని యీసమాజముగూడ నుత్పథము నవలంబించినదను పేరు నార్జింపకుండ నుండుటకు సమాజమువారు సంప్రార్థితులు. గతానుగతికోలోకయని వారిని వీరు వీరిని వారు ననుకరించుటగాదు కావలసినది. నిర్వ్యాజమైన భక్తిజ్ఞానవైరాగ్యములు తమరు సంపాదించి వీలైనంతవఱకు నితరుల కుపదేశించుటయే సమాజసభ్యులు పూనవలసినపని. భక్తసమాజముయొక్క ప్రథమచికీర్షితమే భక్తిజ్ఞానవైరాగ్యసంపాదన.

---

# దేశబంధువు.

దేశబంధువని యొకమాసపత్రిక రెండుమూఁడువత్సరములనుండి నిజామురాష్ట్రమున, తూపరాణిపోష్టునకుఁజేరిన వడ్డేపల్లిలోఁ బ్రచురింపఁబడుచున్నది. ఇందుఁ గథలు యోగవిషయములు దేశవార్తలు యత్కించిత్సంస్కృతపాఠములు మున్నగునవి యుండెడివి. సంపాదకులు బెల్లంకొండ నరసింహాచార్యులుగారు. వీరు హరికథకులు, నాకుఁ జిరపరిచితులు. వీరికుమారులు వెంకటాచార్యులుగారు కవులు. సోదరుని కుమారులు నరసింహాచార్యులుగారు. పండితులు కవులు. ఇట్టి కుమారులు సోదరులు బాసటగా ముద్రాక్షరశాలగూడ నొకటి స్థాపించి దానియందే దేశబంధువును ముద్రించుచు దేశసేవకులై శ్రీ నరసింహాచార్యులుగారు కీర్తినార్జించుచున్నవారు. వీరిగ్రామమునకు దగ్గఱనుండెడి యేలూరు కాపురముగాఁగలిగి వీరికి బంధువులేయై మఱియొక నరసింహాచార్యులుగా రుండిరి. వారును హరికథకులు కవులు. వీరుభయులు పరస్పరస్నేహముననే ప్రవర్తించుచు నీనడుమ నెందులకో యించుక వైమనస్యము గలిగించుకొనిరి. అటుపై నేలూరు నరసింహాచార్యులుగారు నాతో నొకపరి తమ్ము దేశబంధువులో దూషించిరనియు దానికిఁ బ్రతి వ్రాసితిననియు నది మీపత్రికలోఁ బ్రచురింపుఁడనియుఁ జెప్పి యాదూషణవ్యాసమును వినిపించెను. అందు వీరిపేరెత్తి దూషించినది మఱేమియు లేదు. అయినను గుమ్మడికాయలదొంగ యనినఁ దనబుజాలు తానే పట్టిచూచుకొన్నరీతి వీరు తమకు సంబంధ పెట్టికొనిరి. ఈయన దన్నునిందించినవ్యాస మన్యకర్తృకమైనను దేశబంధువు ప్రచురించుటచేఁ దత్పత్రికనుగూడ నించుక యెగ్గాడనే నయ్యది తీసివేయుఁడనియు లేకున్నఁ దత్సంపాదకులకు నాపైఁ గోపము వచ్చుననియు వ్రాకుచ్చితి. అంధ్రుల కాయన యిది చిత్తుకాపీయనియు

సాపులోఁ దీసివేతుననియుఁ జెప్పి తరువాతఁ బోష్టులో నా కావ్యాసమును బంపియుండెను. దాని నేను ముద్రణశాలకుఁ బంపించితి. వారు ముద్రించిరి. నా పత్రిక పంపవలసినచోటులకుఁ బంపితి. ఈజ్యేష్ఠమాసపు దేశబంధువులో సంపాదకులు నన్ను మందలించియున్నవారు.

వార లేలూరు నరసింహాచార్యులుగారి నిట్లేల మాపత్రికను దూషించితివని ప్రశ్నించిరఁట. అయ్యది నేను వ్రాయలేదనియు నభినవసరస్వతీపత్రికాధిపతి స్వయముగా నావ్యాసమున దూర్చియున్నాఁడనియు నాయన ప్రతిసెప్పెనఁట. ఈచెప్పినది నా స్తవమే యైన నింతకన్నఁ గృతఘ్నత యేమియుండును? ఏలూరునరసింహాచార్యులుగారు నాపత్రికకుఁ జందాదారులుకారు. వడ్డేపల్లి నరసింహాచార్యులుగారివలెఁ జిరపరిచితులును గారు. అయినను మోమోటముచే నీవ్యాసము ప్రచురింప నొప్పుకొంటిని. ఇదియునుంగాక యాడవరము జమీందారులగు శ్రీబాకరాజు పరాంకుశరావుగారు సిఫారసుచేసిరి. వారును మఱికొందఱు పెద్దమనుష్యులునునుండఁగానే యేలూరు నరసింహాచార్యులుగారు నా కావ్యాసము వినిపించుటయు దేశబంధువునకు సంబంధించిన యత్కించిద్దూషణముకూడఁ దీసివేయువలసినదని శ్రీపరాంకుశరావు దేశాయిగారును నాతోపాటు చెప్పినవారే. ఆవర్జనలు నాదగ్గఱనుండియుండదని యే॥ నరసింహాచార్యులుగారు నామీఁదికిఁ ద్రోసిరి కాఁబోలు. కానిందు విద్వద్బ్రాహ్మణులకు సంబంధించిన పరమార్థవిషయములో నావంతయు నబద్ధమాడని పరాంకుశరావుదేశాయిగారిది విమర్శించి తగు పరిహారము చేయకుండరుగాన వారికే వదలుచు నా కేతాదృగ్వ్యాసప్రకటన మనుచితమని మందలించినను సవినయవిశేషణము వేసిన దేశబంధుసంపాదకుల శాంతికి సంతసించుచున్నవాఁడను.

———:o:———

# వి వా హ మ హో త్స వ ము.

---

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి జ్యేష్ఠపుత్త్రుని వివాహము పిఠాపురమునకు సమీపమునను్న గొల్లప్రోలుగ్రామములో మహావైభవముతోఁ జరుపఁబడినది. కవులు పండితులు గాయకులు పెక్కుమంది విచ్చేసిరి.

సదస్యమునాఁడు శ్రీ శ్రీ శ్రీ రాజా ఇనుగంటి ప్రకాశరాయణముగారొక నూటపదారుదీహార్యంబులును పట్టుబట్టలును శ్రీ రాజా రావు చెల్లాయమ్మారావుగారు ఐనునూటపదార్లును ముక్త్యాల జమీందారు గారు 116 రులును శ్రీ శ్రీ శ్రీ సింహాద్ర్యప్పరావుగారు రెండునూటపదారులును కట్నములు చదివించిరి. శిష్యులలోఁ గుటుంబములతో వచ్చినవారుగాక యింకను ముప్పదిమందిశిష్యులవఱకు వచ్చిరి. శిష్యులలో నొకరగు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నూటపదార్లు కట్నము చదివించిరి. మఱియు వేమూరి సీతారామశాస్త్రిగారు అర్ధనూటపదార్లు చదివించిరి.

పెండ్లికి దయచేసినవారిలో శాస్త్రిగారిగురువుగారయిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, పిఠాపురమునకు సంబంధించిన నైఘంటికకారులగు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, శ్రీ శతావధాని చిదంబరశాస్త్రిగారు, జంధ్యాల శివన్నశాస్త్రిగారు, వేటూరిప్రభాకర శాస్త్రిగారును మఱియుఁ గొందఱును కలరు. శ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు దయచేసి శాస్త్రిగారి కానందమును కలుగ జేసిరి. శిష్యులలో నొకరగు గుంటూరి వీరరాఘవశాస్త్రిగారు అష్టావధానమొనరించిరి. వైణికులగు పెనుమర్తి రామమూర్తి శర్మగారు వీణను వాయించిరి. కూచి సత్యనారాయణమూర్తిగారు తమచలచిత్రప్రదర్శనమును (Moving cenema) చూపిరి. ఇట్లే యనేకు లనేక

ములు గావించిరి. అందులో శ్రీ యల్లమరాజు పేరిరాజుగారి "శ్రీకృష్ణ గానచిటికెలు" అత్యద్భుతమని చెప్పుటకెంతయు సంతసమగుచున్నది. శాస్త్రిగారు భోగపుమేళమును కుదుర్చకుండుటయే గొప్పసంస్కరణము.

కొందఱు వధూవరులపయిఁ బద్యముల నాశీర్వచనపూర్వకంబుగ వచించిరి. వాని నీక్రిందఁబొందుపఱచుచున్నాను.

—♦ శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు. ♦—

మ॥ సకలాశాపరితః ప్రసారిత మహీచకాంతరవ్యాప్త ది
వ్యకవిత్వప్రకటీకృతాద్భుతయశోవర్ధిష్ణులం జేసి నే
యకలంకాత్మక సద్గురూత్తముల నాయార్యామహాదేవి నిఁ
సకలాభీష్టములిచ్చి బ్రోచు ననుజా! సంప్రీతిఁ గామేశ్వరా !

---

—♦ శ్రీ గుంటూరి వీరరాఘవశాస్త్రిగారు. ♦—

గీతము:—మామిడాకులు కొబ్బరిమట్ట లరటి
కంబములు నారతులు శివకరములైన
వాద్యములు బ్రాహ్మణాశీర్వ్వచన వేద
మంత్రములు మానినీజన మధురకంఠ
పంచమస్వరగానసంభావితములు
జానకీరామచంద్రుల సంతసంపు
పెండ్లిపాటలు కవివాక్యవిశదమైన
కావ్యపీయూషములకు నేకస్వరూప
దివ్యమంగళదేవతా తేజమాచుఁ
దనరుకల్యాణలక్ష్మి యీదంపతులను
సూరమను మాదుకామేశు సుస్థిరముగ
నాయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి
గాచు కలకాల మానందకలనఁదేల్చి!

—:o:—

# హిందూదేశదురదృష్టము.

ఆర్యులారా! నేను వ్రాయబోవు వ్యాస మేకసంఘమునుగాని వ్యక్తినిగాని నిందించుతలంపుతో వ్రాయక అనుభవము (ప్రాక్టికలు) లో నున్న విషయమును మీయెదుటబెట్టుచున్నాను గాన అందలి విషయములు న్యాయైకబుద్ధితో విమర్శింప ప్రార్థించెద. గాంధిగారి పంచబహిష్కారము లాచరించనిది హిందూదేశమునకు స్వాతంత్ర్య మిప్పట్లో మనప్రభువు లివ్వరు-యిచ్చినను మన వేదవ్యాసులు వివరించిన "పంచవ్యసనములు" మాననిచో ఐకమత్యముతో మనము నిర్వహింపజాలము. ఇందుకుతార్కాణము. బర్కెన్ హెడ్డుగారి వాగ్దానమును బాల్డ్విన్ గారి వాక్యధోరణియు మరికొందరి పుక్కచట్టప్రసంగములును నెహ్రూగారి రాజీతీర్మానమును దేశమొత్తమునను శర్మిదేవి గురుకులమందలి అసహాయోద్యమనాయకులగు అయ్యర్ వరదరాజులునాయుడిగారి వివాదచర్యలు రాజధానులమొత్తమునను గుంటూరు జిల్లా చేబ్రోలునందలి దేవాభక్తుని సీతారామయ్యగారి వారసత్వపుదావాలో కాంగ్రెసువాదులు కోర్టులకెక్కుట జిల్లామొత్తమునను యింతయేల మా దండమూడి యను పల్లెటూరిలో ఇంటికొకదావా బయలుదేరుటయేగాక దేవాలయధర్మకర్తల పాలనగూడ అయికమత్యములేక అధ్వాన్నముగానుండుట శ్రద్ధతో గమనించినచో పైవ్యాసఫలితము విశదపడగలదు. ఉదాహరణకై కొన్నిటి పేరెత్తితిగాని కాంగ్రెసులోగూడ అసహాయవాద స్వరాజ్యవాద రిస్పాన్సివువాదాదిభేదము లగుట విదితమేగదా. మున్ముందు హిందూదేశమునందలి ఢక్కామజలినులు, చీనాంబరములు ప్రపంచమునందన్ని దేశములకంటే హిందూ చీనా నాగరికత ప్రారంభమైనది. యించుమించు దీనికి కొంచెముతక్కువకాలములోనే ఆఫ్రికాఖండమందలి యీజిప్టుకూడ నాగరికతనొందినదని వూహింపవచ్చును. కారణమేమనగా-దేవునిఅనుగ్రహము (గాడ్ లైట్) యీశ్వరునిదయ యను వెలుతు రిచట బయలుదేరి యిచటిజనుల నభివృద్ధికిదెచ్చి ఆ వెలుగు సాయముననే ఢక్కామజిలినులు యిచటిప్రభువులను ధనికులనేగాక అయిరోపాదేశమందలి ఎలిజబెత్తురాణీగారు మున్నగు ప్రభువంశముల కలంకారప్రాయమైనవి. ఇక నీ హిందూదేశములోని మాలమాష్టి నూలుబట్టలు మనదేశమందలి సామాన్యనాగరికకుటుంబములలోని స్త్రీపురుషుల కలంకారప్రాయమయినవి. అప్పట్లో ననుబోటి

గ్రామనివాసులు తమతల్లి తోబుట్టువులు మున్నగువారు కొయ్యరాటములతో స్వదేశి పాటలు రాగాలాపములు జేయుచు వారిహస్తములయందలి గాజుల గలగలశబ్దములు తాళములుగా లయించుచూ వడకిన చేతినూలు (ఖద్దరు) తో నేసిన వస్త్రములై మాశరీరము లలంకరించినవి. అట్టి హిందూదేశమునకు అలెగ్జాండరుయొక్క రాకయే సాయంకాలప్రాయమైనది. అనంతర మీదైవవెలుతురు గ్రీకుదేశముమీదుగా అయిరోపాలోని డచ్చి పోర్చుగీసు మున్నగుదేశములపై ప్రసరించి వారిని వర్తకులుగా నీదేశ భాగ్యములో పాల్గొనజేసి అనంతరమున ప్రస్తుతదేశపాలకులగు నాంగ్లేయులదేశముపై కెగబ్రాకినది. అదియే మనదేశమునకు రాత్రిభాగముగా స్వాతంత్ర్యభాను డస్తమించెను. యేమనగా మనదేశ చేతిపరిశ్రమలు నశించుటకై ముఖ్యముగా మన స్వదేశి నూలు వస్త్రములపై భరింపరాని పన్నులు విధించి వారి లాంకషైరు మాంచెస్టరు మున్నగు యంత్రశాలల నభివృద్ధికిదెచ్చిరి. ఇట్లనే ఇటీవల మరికొన్ని అధికపన్నులు విధించుటచే ఆర్థికశాస్త్రవేత్తలు ఆంగ్లేయుల నికరాదాయము వత్సరమునకు పదునైదు పౌనుల కధికమనియు మనహిందూదేశాదాయము వత్సరమునకు తలకొకపౌననియు నిర్ధారణజేసియుండుట మీవంటి దేశచరిత్రలెరింగిన నాగరికులకు తెల్లంబే కదా. దైవకృప మనదేశ మావరించినపుడు మన అర్జునునకు వులూచియను నాగకన్యద్వారా పాతాళలోకగమనమును తండ్రియగు ఇంద్రునిద్వారా వూర్ధ్వ (స్వర్గ) లోక గమనమును అన్నయగు ధర్మజుని రాజసూయముద్వారా భూలోకాధిపత్యము లభించినట్లే మనప్రభువులయం దిపుడు దైవకృప (వెలుతురు) గలిగియుండుటచే సబ్ మెరీనులు ద్వారా పాతాళమనదగు సముద్రగర్భయానమును జప్లీనులు ఏరోప్లేనులద్వారా ఆకాశగమనమును సూర్యుడస్తమించని ప్రపంచమునం దయిదవభాగమగు భూమినేలుచుండిరి. యిదిగాక మనపూర్వులు పంచజ్ఞానేంద్రియములు కర్మేంద్రియము లీదైవకృప చేతనే స్వాధీనపర్చుకొని ఐహిక ఆముష్మికసౌఖ్యములొందిరి. ఇప్పటిమనదేశీయుడగు జగదీశచంద్రబోసు చెట్లకుసహా ప్రాణశక్తిగలదని రుజువుచేసెనేగాని దానివలన ఐహిక లాభముగల్గు మార్గ మిదివరకు జ్ఞాపడయ్యె. మన ప్రభుత్వదేశీయులన్నో యీ దైవవెలుతురులోనుండి పంచభూతములు స్వాధీనములోనుంచుకున్నారాయనునట్లు పృధివిఅంశయగు రాక్షసిబొగ్గుమున్నగువానివలన నీలిమందుమున్నగువాని సృష్టించుట జలపాతమువలన ఎలెక్ట్రిపవరు సృష్టించుట యెముకలుమున్నగువానివలన తేజోభూతమనదగు భాస్వరాస్ మున్నగువాని కనుగొనుట వాయుభూతమువలననే "గ్యాస్" మున్నగువాని కనుగొనుట యేరోప్లేనులు జప్లినులచే ఆకాశభూతమును స్వాధీనపరచు

కొనుట మున్నగు ఐహికోపయోగములు కనుగొని సర్వజనోపయోగకరములుగా నొనర్చి సర్వమానవుల స్వాధీనము జేశికొనిరి. యిందు జర్మనుదేశముపై ప్రసరించిన దైవవెలుతురు సినిమాసమీపస్థులగువారి కండ్లు మిరుమిట్లుగొల్పి బాధజేసినట్లు వారి పశుబలముచే మారణయంత్రముల సృష్టింపజేసి వారినేగాక సోదరమానవుల నందరిని 1914 సం॥ రం మొదలు 1918 వరకు నాశనమొనర్చుటకు కారణమాయెను.

అనంతర మాదైవవెలుతురు (కృప) అమెరికాదేశముపై ప్రసరించి ఆల్వా ఎడిసన్ మున్నగువారివలన రూపగ్రాహి శబ్దగ్రాహి యంత్రములగు "ఫొటోగ్రాఫ్" "ఫోనోగ్రాఫ్" యంత్రములును "హెన్రిఫోర్టు" మున్నగువారివలన "మోటారు" యంత్రములుమున్నగు సాధనసామగ్రిచే వారి నభివృద్ధికిదెచ్చుటయే గాక మన ప్రభువులకుగూడా అప్పులివ్వదగిన రాక్‌ఫెల్లరువంటి కోటీశ్వరులను మేనత్తమేన మామబిడ్డలగు కెయిజరు జార్జి చక్రవర్తుల మధ్యనున్న పోరులో రాజీకుదుర్చుటకు విల్సన్ పండితునివంటి మేధాసంపన్నులను సృజించెను. అయిరోపా అమెరికా మధ్య కాలములో అయిరోపాలోని రుష్యాదేశముబారిన పక్క వెలుతురు జర్మనివలెనే రష్యా వారిని బాల్షివిక్కులుగా జేశినది. అనంతర మాదైవవెలుతురు ఫసిఫిక్ మహాసముద్రము మీదుగా బయలుదేరి ఇపుడాశియాఖండమునకు జేర్చబడిన జపానుదేశముపై ప్రసరించి ముప్పదియేండ్లలో లోకానంద హాశ్చర్యకరములగునట్లు వారికనులు తెరపిజేయుట చేతనే వారిపరిశ్రమలు అందు ముఖ్యమైన బట్టలనేతపరిశ్రమ మన బొంబాయిమిల్లులు మూలబడవలసినంత అవస్థకుదెచ్చినది.

ఇప్పటికిని మనహింధూదేశమునకు "పంచపంచ ఉషఃకాలః" అనగా యాభై అయిదుగడియలు అహోరాత్ర మరువదిగడియలలో నయినది=అనగా కోడికూతకాల మైనది. చీనాదేశమునకు సప్తపంచ అరుణోదయమనగా అహోరాత్రములలో యాబది యేడుగడియలు (అరుణోదయకాలము) ననగా యీశ్వరానుగ్రహము మార్చినది. గావుననే ఇపుడు చీనాలో గొప్ప జాతీయాందోళనమును యిండియాలో ఆందోళనా సూచనలును పొడకట్టినవిగాని కోడికూతకాలమునకు జనుల కనులు బాగా విప్పారవు

గావుననే లేచుటకు బుద్ధికలిగినను నిద్రనుండి లేవలేక కొందరులేచిన జాతీయవాదులు కాళ్ళకు మంచములుమున్నగునవి తలలకు ద్వారబంధములు మున్నగునవి చీకటిలో తగిలి బాధనొందునటువంటి అవస్థలలో నుండిరి. యివియే నెహ్రూగారి రాజీతీర్మాన మంగీకరింపబడకుండుటబాల్టువిక్ మున్నగువారి నిరంకుశోక్తులు పల్కుచట్టములు శరత్ దేవి గురుకులమునందలి అయ్యరువరదరాజులునాయుడుగార్ల భేదాభిప్రాయములు చేబ్రోలు కాంగ్రెసువాదులు కోర్టులకెక్కుట కాంగ్రెసులో పలుచీలికెలు. హిందూ మహమ్మదీయుల పోరాటములు. బాపట్లవంటిచిన్న తాలూకాలోసహా నాలుగేశి శివిల్ కోర్టులు జీవనాధారముగలవారలుసహా కోర్టులు స్కూళ్ళు, వదలలేకుండుట. గవర్న మెంటువారు లైశెన్సులివ్వని మాదండమూడివంటి పల్లెటూళ్ళలోసహా త్రాగుడు హెచ్చగుట. హిందూదేశమున నూటికి తొంబదిపాళ్ళు ప్రజలకు జీవనాధారమైన వ్యవసాయాభివృద్ధికి భంగకరములగు పలువిధనిర్బంధశాసనములు ప్రభుత్వమువారొనరించుట. వారికి చేదోడువాదోడుగానిల్చుటయేగాని మన ప్రజాప్రతినిధులకు ప్రజల వోట్లనడుగుకాలముననున్న ఆతురత ప్రజోపయోగకార్యకాలమునలేకుండుట అమాయకులగు మనరైతుసోదరులు జాతరవద్ద గొంతుకోయించుకొను గొర్రెలవలె మిన్నకుండుట మరికొందరు "చిన్నినాపొట్టకు దీర్ఘాయురస్తను" సామెతమేరకు తమపను లెట్లో నెరవేర్చుకుని సోదరుల కష్టనష్టములలో పాల్గొనక వుపేక్షవహించుట చూడగా హిందూదేశముపై దైవకృపయను వెన్నెల బాగా ప్రసరింపకపోవుటయేనని యెల్లవారికి బోధపడకమానదు. అయినను చీకటినడచువాడు మెల్లమెల్లగ తడవుకొనుచు నడచి నట్లును బురదలో నడచువాడు తొందరపడక కాలూని నడచునట్లును తీవ్రపద్ధతులు మాని "అహిమూషకన్యాయముగా" యేమెండ కాగొడుగన్నట్లు ప్రభుత్వమువారి నడుగుపట్లను స్వంతకార్యకరణమందును అప్రమత్తులమై కార్యాచరణమునకు గడంగితిమేని యీశ్వరానుగ్రహము సమీపించినకొలది కార్యసాఫల్యత నొందుదుమని విన్నవింపుచు అట్టి యీశ్వరునిదయగోరు మండె చినవెంకయ్యవ్రాలు.



# హిందూదేవాలయముల నవుకరీలకష్టములు.

—— ·o: ——

1. హిందూదేవాలయములను పూర్వము ప్రభువులు నూతననిర్మాణములుచేసి ప్రతిష్టించి ప్రభువులకు జరుగవలశియున్న అన్నిమర్యాదలుమాదిరిగా శ్రీస్వామివార్లకుకూడా అన్నిభోగములున్నూ సమస్తఉపచారములున్నూ సర్వదా నిర్విఘ్నముగా జరుగగలందులకుగాను శ్రీప్రభువులు అన్నిబాపతులనవుకరీలను యేర్పరుచుతూ వారికి యీనాంభూములు వసతులు కలుగజేసియుండిరి. అయితే దేవాలయములలో సర్వదా కనిపెట్టుకొనియుండే అర్చకులున్నూ స్థానాచార్యులు ఆచార్యులు వేదపారాయణ స్వస్తివాచకము సంగీతము భజన భయంత్రీమేళము కుంభారతి నాట్యం వాహకులు కుమ్మర సన్నిధికోల భాకా నభిరీ మొదలయిన అన్నిబాపతులవారికి ఆయా నవుకరీలుచేయుచు అనుభవించులాగున అన్నివసతులు కలుగజేసియున్నందున తదాది అవిఛ్ఛిన్నముగా జరుగుచునే యుండెను.

2. రేపల్లె తాలూకా పెదపులివర్రుగ్రామంలో వేంచేశియుండే శ్రీనరేంద్రేశ్వరస్వామి శ్రీ వరదరాజస్వామివార్ల దేవస్థానములలో పయిచెప్పిన అన్నినవుకరీలకుగాను శ్రీరాచూరిజమీందారువారి పూర్వీకులు షుమారు య 450 లకు పయిగా యీనాంభూములు యిచ్చియుండిరి ఇట్లుండగా పయినవుకరీలలో భయంత్రీలకు షుమారు య 35 లకు పయిగా యీనాంభూములు అనుభవించుచూ దేవాలయములలోకి సరీగా రాక నవుకరీచేయనందున్నూ షుమారు 4 సం॥ పయికాలముక్రిందట యీగ్రామఉద్యోగస్తులు జమాబందీకాలమందు శ్రీగుంటూరు డి॥ కలెక్టరుదొరవారికి పంచరత్నముల లెక్కలలో వ్రాశియు చెప్పగా భక్తులను అనుగ్రహించతలచియున్న ఆపరమేశ్వరుని కటాక్షముచే శ్రీకలెక్టరుదొరవారు భయంత్రీల అనుభవములో యుండే యీనాంభూములను శేరీలుగా మార్చియుండిరిగాని వారు హిందూమతమునకు సంబంధించనివారున్నూ ఇతర దేశీయులు అయినందున వారికి ఆపరమేశ్వరుడు అలాగంటివుద్దేశ్యము కలుగజేశియుండేనని చెప్పుటకు సందియములేదుగాని తదాది భయంత్రీలు దేవాలయములకు రాకను పూర్తిగా నవుకరీచేయుట చాలించినందున మిగతా అన్నిబాపతుల నవుకరీలవారున్నూ దేవాలయములలోకి వెళ్ళకుండాను నవుకరీ చాలించెయడ్లే తమకు కూడా యీనాంభూములు శేరీలుగా మారగలవనే నమ్మకముతో కొందరుచాలించ ప్రయత్నములోను మరికొందరు పూర్తిగాను చాలించి

యుండిరి. పూర్వము ప్రభుచిహ్నములుగాయుండే దేవాలయములు విషయమై సరియైన పాలన చేయనందున ప్రస్తుతం భర్తలేని స్త్రీమాదిరిగాయుండెను. అది అంతయు ఆపరమేశ్వరుని కటాక్షమని చెప్పుటకు సందియములేదు.

3. మన హిందూదేశములోని ప్రజలు దొరతనమువారిని తాము స్వయముగా పాలనచేసుకోగలమనియు స్వరాజ్యం యిప్పించమనియు పెద్ద ఆందోళనచేయుచున్నందున వీరికోరికమీదనో లేకవీరియందు అనుగ్రహంచేతనో దొరతనమువారు వారి అధికారములకు లోబడి వీరికి కొన్ని పదవులు యిచ్చియుండిరిగాని తదాది కొన్ని పదవులను పొందియుండియు వీరు చేయు ప్రజాపరిపాలనాకార్యములలో ముఖ్యమైనవి యేవనిన పూర్వము శ్రీ శ్రీ శ్రీ విక్టోరియామహారాణిచక్రవర్తినిగారు హిందూమతధర్మములనుగురించిగాని దేవాదాయ ధర్మాదాయములనుగురించిగాని ప్రభుత్వమువారు జోక్యంకలుగజేసుకోమని శెలవుదైచేశియున్నట్టున్నూ అప్రకారం వారున్నూ వారిపరంపరావారున్నూ కూడా జరిగించినట్టుగా పెద్దలవలన వింటూవున్న విషయమే అయియున్నది.

4. ఇట్టిస్థితిలో ప్రస్తుతపు నవనాగరీకులు కొన్నిపదవులు పొంది ప్రజాపాలన విషయమై వారుచేయు ముందుసంస్కరణ యేదనిన ముఖ్యముగా హిందూమతముల మీదను దేవాదాయ ధర్మాదాయములమీదను యెక్కువపరిశ్రమచేయుచు దేవాదాయము నవుకరీ యీనాంభూములలో కొందరికిమాత్రం శేరీలుగా మార్చించవలెనను ప్రయత్నములలో యున్నట్టుగా ఆంధ్రాది పత్రికలమూలమున చూచుచు వినుచున్నారము. అట్లు యీనాములు శేరీలుగా మార్చుట అనేది దేశక్షేమమున్నూ ప్రజాసౌఖ్యమున్నూ దైవభక్తికి ముఖ్యకారణమని చెప్పుటకు సందియములేదు.

5. ఇట్లుండగా ప్రస్తుతం నవుకరీ యీనాములుగల కళావంతులకు దేవాదాయములోయుండే నాట్యం కుంభారతికిగాను యేర్పడియున్న యీనాంభూములవల్లను వారికి వ్యభిచారవృత్తియేర్పడినదనిన్ని యీనాములు శేరీలుగా మారినచో వ్యభిచారం పోగలదనియు పెద్ద ఆందోళనచేయుచుండిరిగాని కళావంతుల సంఘములో నవుకరీలు కలవారు 1/4 వంతున్నూ నవుకరీలు లేకుండా యితరవృత్తులమీద ఆధారపడినవారు 3/4 వంతులున్ను యుందురు. వీరిలో నవుకరీలుకల 1/4 వంతువారికి శేరీలుగా మారినచో వ్యభిచారం నశించకలదా ? అట్లునశించునని చెప్పేయెడల నవుకరీలు లేక యితరవృత్తులమీద ఆధారపడియుండె మిగతా 3/4 ల వారిలోను వ్యభిచారం యెట్లు నశించగలదు. అయిననూ ఈసంఘమువారిని వ్యభిచారముతో వుండమనిగాని

ఆవృత్తివల్లనే జీవించవలెననిగాని యెక్కడను చెప్పియుండలేదు. భగవంతునికి కళంకరహితగా సేవజేసిన మాత్రాన దానివలన వ్యభిచారం అలవడదు. ఒకవేళ వ్యభిచారం పూర్తిగా బాధించుచున్నట్లు కనుపించెయెడల వ్యభిచారం రద్దుకాగల శాసనముకావలెనని కోరుట యుక్తముగాని యీనాములవల్లను వ్యభిచారం యేర్పడినదని చెప్పుటయు యీనాములు శేరీలుగా మార్పించమని కోరుటయు సర్వదా శ్రేయస్కరముకాదు. అయినను వారుచెప్పే నిశ్చయతత్వం యెరిగియున్న కొందరు శాసనసభ్యులున్నూ శాసనసభ వైస్ ప్రెశిడెంటుగారయిన శ్రీ ముత్తు లక్ష్మమ్మరెడ్డి గారున్నూ కళావంతులసంఘమువారికి యీనాములవల్లను యేర్పడినదనిచెప్పే వ్యభిచారదోష నివృత్తికొరకు వారి యీనాంభూములను శేరీలుగా మార్పించవలెనని బహుప్రయత్నములు చేయుచున్నట్టుగా ఆంధ్రాదిపత్రికలమూలముగా చూచుచు వినుచున్నాము.

6. యిదిగాక నవుకరీయీనాములమీదను కొంతరుణములుచేశియు భూములు బాండ్లువగైరాలు వ్రాశియు వుండుటకలదు. బాకీదార్లకు బాకీలు రావనే భయముతో యుండుట కలదు. అయినను ప్రస్తుతం ఒకసంఘమునకె వృత్తిని భిన్నపరిచి శేరీలుగా మార్పించినచో మిగతా అన్నినవుకరీలసంఘమువారికి వారుచేయు వృత్తులయందు కొంత నిందారోపణచూపుచూ అదేమాదిరిగా ఆందోళనచేయగలరు. అప్పుడు ప్రతి వారివిషయమై న్యాయసభ్యులు ప్రయత్నించుట చాలాకష్టతరమున్నూ దీర్ఘకాలమున్నూ కాగలదు. అందువల్లను దొరతనమువారికి చాలా ధనవ్రయమున్నూ సభ్యులకు చాలాశ్రమయు కాగలదు. అట్లుకాకుండా సర్వదా దేవాలయములలో అహోరాత్రములు కనిపెట్టుకొనియుండే అర్చకులను ఉద్ధరించుట ముఖ్యకర్తవ్యం కాబట్టిఒక పెదపులివర్రుగ్రామమునకే షుమారు రు 500000 లు పయిగా కిమ్మతుచేయతగినవన్నీ శేరీలుగా మార్చిన సాలు 1కి దొరతనమువారికి రు 4000 లుశిస్తు రాతగినవన్నీ షుమారు 450 లు పయిగా యీనాంపల్లం భూములు వుండగా దొరతనమువారి పరిపాలనా దేశములో యిలాగంటి ఆదాయమురాతగిన భూములు యెన్నిమో యుండవచ్చును. పయిఅన్ని సంగతులున్నూ దొరతనమువారు శాసనసభ్యులు సహా అందరు యెరిగియున్నవిషయమై యున్ననూ పూర్వం ఈనాములు యిచ్చియున్న దాతల ఉద్దేశ్యమునకు వ్యతిరేకము జరిగెయెడల సర్వదా శ్రేయస్కరము కాదు. అయిననూ వారు చేయబూనుకున్న పనికి అడ్డుపెట్టువారు లేనందున దేవాలయములలోని అన్నిబాపతుల నవుకరీలవారికిన్ని వారికి నియమించియున్న వృత్తులు ప్రస్తుతపుకాలమునుబట్టి యేహ్యముగా

తోచుచున్నందున అట్లుకాకుండాను అన్ని నవుకరీలవారికిన్ని ఒకేపర్యాయము గా వృత్తులు యేమియు మార్చకయే యీనాంభూములను శేరీలుగా మార్పించినచో యిక ముందు దేవాదాయము నవుకరీ అనే హీనపదమును వొదలిపెట్టి గౌరవస్థితిలోకి రావడముకున్నూ దొరతనమువారికి శిస్తు ఆదాయమున్నూ బాకీదార్లకు పూర్తిగా బాకీలసొమ్మున్నూ రాగలదని నమ్ముచున్నారము.

—— * ఉ దా హ ర ణ. * ——

7. ప్రపంచములో పండితునిచూచియు పాండిత్యముగ్రహించినవారు ఆపండితుని మరణమునుచూచుట చాలా కష్టముగాని ఆపండితుని మరణవార్తవినిన యితరులకు పండితునిచూచువారి కష్టముండజాలదు.

8. ఒక ఆరోగ్యవంతుడయిన పురుషుడు తన కాలివ్రేలులో ఒకవ్యాధి కలదనియు అందుమీద కాలు అంతయు బాధకలిగి చెడిపోగలదనియు పెద్ద ఆందోళన చేయుచు ఒక ఘనవైద్యునకు చెప్పెనట. ఆయనగారికి ఘనవైద్యుడని బిరుదువచ్చినదని సంతోషమేగాని వైద్యమందు వుండే గుణవిశేషములు బాగా విచారించకయే ఆచెప్పిన బూటకము మాటలను విని నిశ్చయమనుకొని వ్యాధిపరీక్ష లేకయే ఆకాలు అంతయు నరికివేయ ప్రయత్నించెనటగాని యేజబ్బులేనికాలు వేలునిమిత్తం కాలు అంతయు నరికినవెంటనే ఆపురుషునికి అంగలోపంచేసర్వాంగములకు వెంటనేనిశ్చయముగా జబ్బు యేర్పడుటయె స్థిరము అటుమీదట ఆపురుషుని సర్వాంగమున్నూ ఆఘనవైద్యునిచే నరికివేయవలశివచ్చును. అట్లుచేసినచో ఆపురుషుని ఆఘనవైద్యుడే పూర్తిగానరికి ప్రాణముతీసెననిచెప్పుటకు సందియములేదు కాబట్టి వైద్యుడు గుణవిశేషములు తెలుసుకొనియే వైద్యంచేయుట యుక్తముగనక చదువరులు గ్రహింతురు గాక.

ఇట్లు,
గోగినేని శీతయ్యాచౌదరి.

——o——

## — * శ్రద్ధార్హులగు బ్రాహ్మణులు. * —

సీ॥ బహుకుటుంబికులు పావనతము లాహారనియమంబుగావింప నేర్చువారు
అపరవయోన్వితు లధ్యానపేతులు షట్కర్మములు శ్రద్ధ జరుపువారు
ఆరోగ్యసంయుక్తు లఖిలసద్గుణయుక్తు లంగలోపము లేక యలరువారు
ఆత్మవేత్తలు నిరతాగ్నిహోత్రులు వేదశాస్త్రంబులం జక్కఁ జదువువారు
అవని శ్రాద్ధకృతుల నామంత్రణము సేయఁ దగినయట్టివారు ధరణిపాల!
తగనివార లెవరొ తద్బ్రాహ్మణబ్రువుల్ కీర్త్యమాను లాలకింపు మిఁకను. ౧౩౬
సీ॥ అధికాంగయుతులు హీనాంగులు సర్వభక్షకు లపాంక్తేయులు శౌచహీను
లామయగ్రస్తులు నన్నృతవాదులు వ్యర్థదంతులు వేదశాస్త్రవిరహితులు
వేదవిక్రయకులు వేదవిప్లవకారు లాచారవర్జితు లతికృశాంగు
లతిదీర్ఘు లతికాయు లపవాదసంయుతు ల్గురుతల్పగులు నాస్తికులు ప్రమత్తు
లన్నకన్న మున్న యాచరితోద్వాహు లట్టి పూర్వమైన యాహితాగ్ను
లధ్వరములొనర్చ నవ్వారు గూడ శ్రాద్ధములఁ బనికిరారు ధరణినాథ! ౧౩౭
సీ॥ వడ్డివ్యాపారంబువలన జీవించువా రంగళ్ళ సరకులనమ్మువారు
శిల్పంబు వృత్తిగా స్వీకరించినవారు చౌర్యంబె మనుగడసలుపువారు
క్ష్మాపతికడఁ జేరి చాడీలు చెప్పువా రత్యంతదాంభికులైనవారు
పుంస్త్వహీనులు రోమఘ్నులు నిర్లోము లన్యహింసకులు కృతాయుధులును
గోతివన్నె పండ్లు కునఖము ల్గలవారు మంచి పెండ్లమును త్యజించువారు
తల్లి దండ్రి వీడి దవ్వులమనువారు కారు శ్రాద్ధయోగ్యు లోరసేశ! ౧౩౮
సీ॥ నిజగోత్రమునను జన్మించినవానిని బ్రవరలో నైక్యమేర్పడినవానిఁ
జేసినమే ల్మఱచినయట్టివానిని స్వయముగా సేద్యంబుసలుపువాని
గోచియు మొలత్రాడు గూడ లేనటువంటివాని వికర్మస్థుఁడైనవానిఁ
బరకాంతతోడఁ గాఁపురము సేసెడివాని నజ్ఞాతకులుఁడైనయట్టివాని
వంధ్యకును నష్టసంతానవతికిఁ బెండ్లికాకమున్నె రజస్వలయౌ కలికికి
భర్తయగువాని వర్జింపవలయు శ్రాద్ధములను బితృగౌరవం బాత్మఁ గలిగెనేని.
ఆ॥ ఇంక మొదటినుండి యెవ్వరు పంక్తిపావనులటంచు ఖ్యాతివడసినారొ
యెవరు శ్రాద్ధకృతుల నెంతయు శస్తులో వారలను వచింతు ధీర! వినుము. ౧౩౯
సీ॥ ఇలను త్రిణాచికేతులు త్రిసుపర్ణులు త్రిమధువు లంగషట్కమహితులును
విద్యావ్రతస్నాత వివిధపురాణజ్ఞ ధర్మశాస్త్రాధ్యేతృ తత్త్వవిదులు

జ్యేష్ఠసామాథర్వశిరముల నెఱుఁగువా ర్క్రితుగాములు పరోపకారరతులు
మృష్టాన్నభోక్తలు వృత్తవాత్స్యలును సద్యఃశ్రాశికులును సత్కర్మకరులు
ప్రియత దౌహిత్రి జామాతృ భాగినేయ జాపకులు పంక్తిపావను ల్మామహేంద్ర!
తన్మిళిత నింద్యులేని శ్రాద్ధములఁ గుడిచి పితరులను దన్పుదురు కులయుతులైన.

ఉ॥ కాన బహుప్రియత్నములఁ గన్గొనవలెను గులంబు పూర్వ. మా
పైని తదీయ శీలమును బ్రియ మెఱుంగఁగనౌను. గన్యకా
దానము శ్రాద్ధకర్మమును దత్పరతం బొనరించువేళలం
దీనియమంబు పూనవలె నెల్లద్విజాతులు మానవేశ్వరా! ౧౪౨

చం॥ కులమును శీలముం గలుగు కూళలనైనను శ్రాద్ధభుక్తికిఁ
బిలువఁగవచ్చుఁ. గన్యనిడి పెండిలిసేయఁగవచ్చుఁ. గాని యా
కులమును శీలముం జెడిన కోవిదవర్యునకైనఁ గూడ. దా
లలినొనరింప భస్మమున లాజలువేల్చినయట్లు లయ్యెడిఁ. ౧౪౩

ఆ॥ కాన నల్పవిద్యునేని కులాచారసహితుఁ బిలువవలయు శ్రాద్ధమునకు
నొంకదంపినట్లు లూషర క్షేత్రంబునందు విత్తినట్లు లన్యుఁబిలువ. ౧౪౪

కం॥ ఈవిధ మటువంటి మహీదైవతముల గుర్తెఱింగి తత్పదయుగముఁ
బావనముఁ బాణియుగి సద్భావనఁ బట్టుకొని మ్రొక్కి పదపడి భక్తిఁ. ౧౪౫

శ్లో॥ "ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః
యే అత్ర విహితా శ్శ్రాద్ధే సావధానా భవంతు తే"

కం॥ అని కుడిమోకాల్ధరనిడి వినయంబున విన్నవించి విశ్వేదేవా
యనమం దిరువురువిప్రుల మును పామంత్రింపవలయు భూవరతిలకా! ౧౪౬

తే॥ అంత నపసవ్యముగఁదొడ్గి యజ్ఞసూత్రి మొగిని బిత్రర్థముగ నొక్కరొక్కరికిని
మువురుమువ్వురుద్విజులనో మువ్వురికిని మువురనో యొక్కరునో పిల్వనవు మహీశ!

ఆ॥ మాతృపతృ మునను నీతిరెవిధిగాన నవలఁ దన్మహీసురాంఘ్రులను బ
రిస్పృశించి ప్రియతహృదయతఁ బితృభక్తి వక్ష్యమాణముక్తి వలుకవలయు.

కం॥ "నాతండ్రియుఁ దాతయు ముత్తాతయు నీదేహమందుఁ దారుందురు గా
కాతతనియమముదాలిచి ప్రీతిని నీవుందుగాక పృథ్వ్యమరేంద్రా!" ౧౫౦

కం॥ అని పితరుల మాతామహులను బిలువఁగవలయుఁజూ యిలారమణా! య
ల్లవ యజమానుఁడు ద్విజులను మనవలయును బ్రహ్మచర్యసహితముగాఁగఁ॥

కం॥ శాంతమనస్కుతి నారేయంతయు వెళ్లించి పిదప నరుణోదయమహా
సంతకె మేల్కొని తదహ మొకింతయుఁ గోపంబులేక యొసఁగఁగవలయుఁ॥

సీ॥ స్వాధ్యాయపాఠంబు సల్పఁగాఁజనదుచూ యానర్తభూపాల! యాదినమునఁ
గుత్సితంబగుచేఁతకుం దిగఁదగదుచూ యవనీతలాధ్యక్ష! యాదినమున
నభ్యంగనముసేయ నర్హంబుగాదుచూ యంభోధిగంభీర! యాదినమున
దూరప్రయాణంబు దూషితంబగునుజూ యాశ్రితావనదీక్ష! యాదినమున
యానమును శ్రమంబు నానాఁడు నింద్యంబు లట్టులుండి సూర్యుఁ డభ్రమధ్య
గతుఁడుగాఁగఁ గుతపకాలంబునం దాడి ధవళవస్త్రములను దాల్చి యంత

కం॥ పితృతర్పణముం బొనరిచి గతదినమునఁబిల్వఁబడిన ఘనవిప్రులఁ గు
త్సితజనులు చూడకుండఁ బ్రియతగృహమధ్యమునఁజేర్చి యర్చింపవలెన్. ౧౯౪

సీ॥ శ్వ వరాహ ఋతుమతీ వర్ణచ్యుతులు చూచు శ్రాద్ధంబు వ్యర్థంబు క్ష్మాబిడౌజ!
తైలాక్త పర్యుషిత సకేశ భక్తమౌ శ్రాద్ధంబు వ్యర్థంబు సాధుచరిత!
దక్షిణా మాన శబ్దస్వచ్ఛతల్లేని శ్రాద్ధంబు వ్యర్థంబు సత్యవచన!
ప్రస్ఫోటన ఘురట్ట భవశబ్దమహితమౌ శ్రాద్ధంబు వ్యర్థంబు క్షత్రివర్య!
కలహ పంక్తిభేద కలితమౌ శ్రాద్ధంబు బట్టబయటఁబెట్టఁబడెడి శ్రాద్ధ
మర్ధభుక్త ఘృతపయస్సులు గలశ్రాద్ధ మగును వ్యర్థ మోయహార్యధైర్య! ౧౯౫

తే॥ సంధ్యలను రాత్రిఁ బూర్వాహ్ణసమయమునను బెట్టు శ్రాద్ధంబునందుండ దెట్టిఫలము
పొట్టుగింజలు నుచ్ఛిష్టమును గలసిన శ్రాద్ధమును వ్యర్థమగు రాజచంద్ర! వినుము.

తే॥ బ్రహ్మచర్యంబు వహియింపవలసియుండుఁ గర్తయును భోక్తలును శ్రాద్ధకాలమందు
అట్లుగాకున్నఁ దచ్ఛ్రాద్ధ మగును వ్యర్థ మోమహీపాల! చెప్ప నింకేమిగలదు.

## —♦ శ్రాద్ధార్హకాలములు. ♦—

తే॥ ఎట్టికాలంబులం దెవ్వి యీయఁబడిన శ్రాద్ధ మక్షయఫలమగు నిద్ధరిత్రి
నట్టికాలంబులును వాని నవనిపాల! చెప్పెదనువిను సవధానచిత్తమునను. ౧౯౬

శా॥ శ్రద్ధాపూతమనస్కతం దిలలతో సంమిశ్రితంబైన యా
శుద్ధాంభఃకణమేన్ బితాళ్ళకొఱకెవ్వో నీయఁగాఁబడ్డదై
యిద్ధాత్రిస్థలి నక్షయంబగునో యా యేనోహరంబుల్ మహీ
భృద్ధీరా! వచియించెదన్ విను పితృప్రీత్యర్థ మస్వాదులన్. ౧౯౭

సీ॥ మాఘశుక్లతృతీయ మఱి సప్తమీతిథి భాద్రతృతీయయు ఫాల్గునామ.
యిషశుద్ధనవమి పౌషైకాదశీతిథి యాషాఢమాసంపు టాద్యదశమి
బాహులద్వాదశి బహుళనభోష్టమి శుచి కార్తికక చైత్ర శుక్ర ఫాల్గు

నిక పూర్ణిమలు ధరణీపాల! మన్వాదు-లవ్వానియందుఁ గృతావగాహుఁ
డగుచుఁ దిలదర్భసమ్మిశ్రితాచ్ఛజలము నేని పితృదేవతలఁగూర్చి యిచ్చువాఁడు
పొందు నిందును నందును బూర్ణసౌఖ్య మన్నవస్త్రాదిదాతల నడుగనేల ౧౬౦
ఆ॥ వేనికీర్తనమున నానాఁటి యేనస్సు రూపుమాయఁగలదొ రూఢముగను
వితరులకుఁ గరంబు ప్రీతిపాత్రంబైన యాయుగాదు లధిప యాలకింపు॥ ౧౬౧
సీ॥ వైశాఖసితపక్షవర్తియైనతృతీయ కృత్తదుష్టవ్రాత! కృతయుగాది.
కార్తికమాసాగ్రవర్తియౌనవమి సంస్థాపితసుపథ! త్రేతాయుగాది.
భాద్రపదాసితపక్షత్రయోదశి పాలితశిష్ట! ద్వాపరయుగాది.
మాఘమాసీయమౌ మహితామవాస్య ప్రాకటమానవాధీశ! కలియుగాది.
స్నానదానహోమజపపైతృకంబులం దాచరించుపుణ్య మక్షయంబుఁ
జేయు నయ్యుగాదు లోయిలారమణ! మహాఫలంబులవ్వి యరసిచూడ. ౧౬౨
ఆ॥ మేషతులలలోనఁ బూష ప్రవేశించు దినము విషువసంజ్ఞ నెనయుఁ. నతఁడు
మకరకర్కటముల మనఁజను దిన మయనాఖ్య. మందు విషువ మగును మిన్న.
కం॥ రవి రాశి సంక్రమించెడిదివసము సంక్రాంతి. శ్రాద్ధదేవార్చనలం
దవి క్రమముగా మహాఫల మవనిజనావళి కొసంగు నానర్తవిభూ! ౧౬౩
తే॥ శ్రద్ధలేకుండనైనను నెద్ది దత్త మే యసత్పాత్రములయందొ యొద్దిదత్త
మద్ది యప్పుడె యక్షయమగును భూమిపాల! సంక్రాంతిమున్నగు కాలములను.

## — * శ్రాద్ధనిర్ణయము. * —

కం॥ శ్రాద్ధము శ్రద్ధామూలము. శ్రాద్ధాఖ్య యదేకతముగ సంసిద్ధం బో
యిద్ధమహీనాయక! యది శ్రద్ధం గావింపఁబడిన సఫలంబగుఁ జూ.
తే॥ ఉర్వివైఁబడు విప్రపాదోదకమున ము న్నపుత్రకులై మృతింగన్నయట్టి
గోత్రజాతులు సుధనుండి యాత్రివిష్టపమున సురలట్లు సంతృప్తి వడయఁగలరు.
తే॥ విప్రపాదోదకంబున విపుల తడిసి యెంతవఱకు కాఱకుండునో యంతవఱకుఁ
దామరాకులదొప్పలతో మహీశ! త్రావుదురుతజ్జలము పితృదైవతములు. ౧౬౪
తే॥ శ్రాద్ధముం బెట్టునటువంటి సమయములను నుర్విపైఁబడు పుష్పగంధోదకమును
నన్నమునుదిను క్రిమికీటకాహిముఖ్య జన్మములఁబొందినటువంటి స్వపితృగణము.
తే॥ వడిగ నపమృత్యువెనసిన వంశజులకుఁ బ్రేతలై యున్న స్వకులసంజాతులకును
బాత్రలనుగడ్గుమీఁద నీగోత్రఁబడినయట్టి యుచ్ఛిష్టమునఁ దృప్తియగునుభూప!
ఆ॥ సంస్కరింపఁబడక చచ్చినవారలుం ద్యాగమొనరిచిన కులాంగనలును
స్వకులజుం డొసంగు వికిరాన్నమునఁ దృప్తిఁగాంచఁగలరుచుమ్మ కాశ్యపీశ!

# అభినవసరస్వతి

సంపాదకుడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనము లును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 కరిణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 12 వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 వర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 15 పశ్యాంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 16 పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| 23 నూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 25 డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 27 ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 28 భారతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్చయనులుగారు) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరు జిల్లా.

౧౧ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు
౧౨ చిక్కరాజు మట్టుపల్లి రావుగారు, చెలకుర్తి.
౧౩ రాచకొండ వెంకటరామయ్యగారు, ఎనమదల
౧౪ నారాయణరావుగారు, దాతారుపల్లి
౧౫ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు-పాపురం.
౧౬ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు
౧౭ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, వంగపల్లి
౧౮ కవులూరి నరసింహారావుగారు, తాలూకా గుమాస్తా-నర్సారావుపేట
౧౯ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౨౦ బేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట
౨౧ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి
౨౨ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం
౨౩ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం
౨౪ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం
౨౫ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - కొల్లూరు
౨౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట
౨౭ నుండ చినవెంకయ్యగారు, దండమూడి.
౨౮ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.
౨౯ తిరుమలనల్యాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - శాతాపురం.
౩౦ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం.
౩౧ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం
౩౨ తాళ్ళవలివ లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం
౩౩ కిషన్ రావు దేశపాండ్యాగారు తాళ్లపల్లి
౩౪ వెంకటరాజయ్య, మక్తేదారుగారు - సీతారాంపురం
౩౫ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.
౩౬ కుంటపల్లి రామారావుగారు, సంగెం.
౩౭ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు
౩౮ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.
౩౯ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము
౪౦ కాకిరాల రామచంద్రయ్యగారు, మముదాపురము
౪౧ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు
౪౨ కొండంభట్లగారి వెంకన్న గారు. గుమ్మడిదల
౪౩ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం
౪౪ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-పెదవీడు
౪౫ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.
౪౬ కుంటుపల్లి అమృతరావుగారు-సంగెం.
౪౭ మొసలి పాపిరెడ్డి మొకద్దంగారు-కొమ్మెపల్లె.
౪౮ మాణిక్యంగారి బాలచంద్రయ్యగారు-హైదరాబాద.